# శ్రీనాథ పద ప్రయోగ కోశము

## ప్రథమ భాగము


సంపాదకులు :

ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం. ఏ.



ప్రకాశకులు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళా భవన్ : : హైదరాబాదు—4.

1966

# తొలిపలుకు

శ్రీనాథ పదప్రయోగ సూచిక మొదటి సంపుటమును ఆంధ్రావళి ముందుంచుటకు మిక్కిలి సంతోషమగుచున్నది. నా మిత్రులును, సహసంపాదకులును, విద్యాధికులును అగు డాక్టరు వల్లా దుర్గయ్యగారు, శిరోమణి శ్రీ చెలమచర్ల రంగాచార్యులుగారును నాకంటె వయస్సున చిన్నవారగుటచే వారిపక్షమున నేనే ప్రసంగించుచు, ఉత్తమ పురుష ఏకవచన ప్రధానముగా మాట్లాడినను విజ్ఞులు క్షమింతురు గాక.

*గ్రంథావిర్భావము* :— "తోటలో పిల్ల — కోటలో రాణి" అను సినీమా కలదని పిల్లలవలన వింటిని. శ్రీనాథ పదప్రయోగ సూచిక ఆవిర్భావ వికాసములు సరిగా ఇట్లే యున్నవి. ఈ యుద్యమము ఉస్మానియా విశ్వవిద్యాలయము తెలుగుశాఖలో ప్రథవించి కొంత కొనలు సాగి, పందిరి దక్కలేక నేల జీరాడు చుండెను. ఆ స్థితిలో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు దీనిని ఆదుకొని మంటపమున కెక్కించి విపశ్చిద్రాజీ నేహ రంగంబుల నటియించుటకు అవకాశము కల్పించిరి. ముద్రణ సౌకర్యము ఇంకను మిన్నగా ఉన్నచో అకాడమీవారు సంపూర్ణ గ్రంథమును ఈపాటికెన్నడో ప్రకటించియుందురు. దీర్ఘసూత్రతచేత లోకము దీనినివిస్మరింపకుండ మొదటి సంపుటమును వారిప్పుడు సమర్పించుచున్నారు.

అది 1961 — 62 సంవత్సరము. ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు ఆంధ్రశాఖలో నేను ప్రధానాధ్యాపకుడుగా నుండిన దివసములు. ఎం. ఏ. ఫైనలు తెలుగు విద్యార్థులకు పరిశోధనారంగమునందు ప్రవేశము, ఔత్సుక్యము కలిగించుటకై (Seminar) సాహిత్య గోష్ఠి కార్యక్రమములు అమలుజరుపుచుంటిని. అప్పుడు ఈ తరగతి వారికి "శ్రీనాథుడు" ప్రత్యేకాధ్యయనమునకు నిర్ణయింపబడిన కవి. అంతకుముందు సంవత్సరము విద్యార్థులు "శ్రీనాథ భారతము" అను పేర శ్రీనాథునిపైనను సమకాలిక కవులపైనను చక్కని వ్యాసములు వ్రాసి విద్వద్గోష్ఠిలో చదివిరి. వీనిని అప్పటి గోల్కొండ పత్రికవారు పుస్తకరూపములో ప్రకటించి యిచ్చిరి. ఈ చిన్న సంపుటమునకు మాన్యశ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు పీఠిక వెలయించిరి.

తరువాత వచ్చిన విద్యార్థి బృందమువారికి గూడ శ్రీనాథుడు విశిష్ట పఠనీయ కవిగా నుండెను. వీరు శ్రీనాథునారాధించుట యెట్లు, తమ్ము ననుగ్రహింప జేసికొనుట యెట్లు! అను జిజ్ఞాసలో నుంటిమి. 1960 సంవత్సరమునందే నన్నయ పదకోశము వెలువడినది. అట్టి మహోన్నత సేవ శ్రీనాథున కేల చేయరాదు అను భావము మెఱుపు మెఱసినట్లు మనస్సులో జిగేలుమన్నది. గురు శిష్యులు తమ శక్తి సామర్థ్యములను పరీక్షించుకొనకుండగనే నడుము బిగించిరి. లేడికి లేచినదే ప్రయాణము. విద్యార్థులకు తోచినదే ముహూర్తము నావద్దనున్న అవశిష్టమైన కవిలెనుండి శ్రీనాథ పద. ప్రయోగ సూచికను నిర్మించుటకు పూనిన విద్యార్థిగణము— వరవరరావు, నరసింహారెడ్డి, ఉషాకుమారి, శివకుమారుడు, హరేంద్రబాబు, సీతామహాలక్ష్మి, వివేకానందం, లక్ష్మారెడ్డి, హరిప్రియ, రత్నయ్య, ప్రమీల, భారతి, అనూరాధ, నిర్మల, వసుంధర, అహల్య, వెంకటేశ్వరరావు, రామమోహనరావు, రామానుజాచార్యులు, సంజీవరెడ్డి, దుర్గాప్రసన్నాంబ. ఇందరు పట్టి శ్రీనాథ సముద్రమును మథించిరి. అది నిజముగా మథించుటయే. కొమ్ములు తిరిగిన విద్వాంసులు కూడ శ్రీనాథమహాకవి ప్రత్యక్షరము అర్థమయినాడని చెప్పగలరో లేరో. ఇంక నీ సాహిత్యవత్సముల మాట చెప్పెడిదేమి. శ్రీనాథుని సేవించి గోల్కొండ పత్రికయు, ఉషాకుమారి విద్యార్థినియు కథావశిష్టులైరి. కాలాయతస్మై నమః.

"కత్తులు లేవు ఖడ్గ గద గాండివముల్ మొదలే హుళక్కి" అని యొక మహాకవి చెప్పినట్లు ఈ విద్యార్థి బృందమునకు వలసినన్ని ప్రామాణిక ప్రతులు లభించలేదు. తుదకు ఆరోపములు వ్రాయుటకు కార్డులును లేకుండెను. బిస్కత్తుల పెట్టె కత్తిరింపులను, రెండంగుళముల కాగితపు తుంపులను, శ్రీనాథ సమారాధనమునకై తెచ్చినవారు కలరు. ఎవ్వరేమన్నగాకేమి. ఆరోపముల మూగమూటలు స్వయం సహాయముతో విద్యార్థులు సాధింపగల మహాకార్యములకు నిశ్శబ్ద సాక్ష్యములుగా నున్నవి.

*గ్రంథ నిర్మాణ క్రమము* :— పదప్రయోగ సూచికా నిర్మాణ తంత్రము నాకును అప్పుడు అనభ్యస్తమే. కావున సారథ్యమునందును దొసగులుండి యుండును. ఒక్కొక్క విద్యార్థికి ఒక గ్రంథమునందు ఒకటి రెండు ఆశ్వాసములకు మించిన భాగమును పద సేకరణకు ఇచ్చుటకు వీలులేకుండెను. ఇందరికి సరిపడు మేలిప్రతులును లభ్యము గాకుండెను. ఒకే గ్రంథ సందర్భమున వేర్వేరు ముద్రణముల నాశ్రయింపవలసి వచ్చెను. ఉదాహరణకు కాశీఖండమును వావిళ్ళవారు రెండు మూడు తడవలు ముద్రించినట్లు కన్పించును. 1933 నాటి ముద్రణములోని పాఠములు ప్రశస్తములుగా నుండగా 1960 (?) ప్రాంతపు ముద్రణము వానిని జటిలము చేసిపెట్టెను. ఉన్నదానిని తొలగించుటయే సంస్కారమని తలంచు పండితులును ఉన్నారన్నమాట. ఇట్లు శ్రీనాథ పద సూచికా సందర్భమున పెక్కు ముద్రణ ప్రతుల సంకీర్ణత యేర్పడినది. తరువాత ఈ లోపమును కొంతవరకు సరిచేసితిమి. కాని అంతయు సరిపడెనని చెప్పజాలను. భీమఖండమునకును ఇట్లే రెండు ప్రతులు (క్రొత్తపల్లి పద్మనాభశాస్త్రిగారి ముద్రణము, వావిళ్ళ ముద్రణము) మమ్మెదుర్కొనెను. నైషధమునకు వేదవరపు వెంకటశాస్త్రిగారి వ్యాఖ్యతో ఆర్. వెంకటేశ్వర అండ్ కో వారు 1914 ప్రాంతమున ముద్రించిన ప్రతి, వేదమువారి వ్యాఖ్యగల ప్రతి, వ్యాఖ్యలేని ప్రతులు కొన్నియు, వాడబడెను. హర విలాసమునకు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ముద్రణము, వావిళ్ళ ప్రతియు చేపట్టబడెను. క్రీడాభిరామమును ఇట్లే. శివరాత్రి మాహాత్మ్యమునకు మాత్రము ఏకైక ప్రతి శరణ్యమయ్యెను. పలనాటి వీరచరిత్రకు అక్కిరాజు ఉమాకాంతంగారు ప్రకటించిన ప్రతిని ఆధారముగా గొంటిమి. ఇక్కడ మరొక్క సమస్య యెదుర్కొనెను. ఉమాకాంత విద్యాశేఖరులు ఈ గ్రంథమునకు అరసున్న – బండిఱాల సంస్కారమును చేయరైరి. శ్రీనాథునివంటి పరమ ప్రామాణికుడైన మహాకవి రచనలకు పద సూచిక తయారుచేయుచు, అర్థానుస్వార శకట రేఫలు లేని ఆరోపములను చేర్చుట అపచారము కదా! తదితర గ్రంథములకును దీనికిని పొంతన కుదురదని కొందరు ఆక్షేపింపగా, కాబోలునని భయపడి పలనాటి వీరచరిత్రమీద అరసున్నలు, బండిఱాలు క్రుమ్మరించుటకు పూనుకొంటిమి. అది యసాధ్య కార్యమయ్యెను. బాల ప్రౌఢ వ్యాకరణముల యనుశాసనము మేరకు గ్రంథమంతయు తిరిగి సంస్కరించు గురుతర కార్యముగా అది యెదురు తిరిగెను. ఏదియో కథలో చెప్పబడిన ముసలివానివలె అందరిని సంతోషపెట్టబూను ప్రయత్నము వ్యర్థమని గుర్తించి త్వరలోనే ఆ మార్గము విడిచిపెట్టి తల తడిమి చూచుకొంటిమి. నాలో నాకే నవ్వు వచ్చెను. పలనాటి వీరచరిత్ర నిట్లు సంస్కరించినను, శ్రీనాథుని శాసనముల మాట యేమి. వానివి కూడ ఇట్లు అయ్యవారినిగా దిద్దవలెనా. అది మన పని కాదను నిశ్చయము కల్గెను.

ఈ విధముగా మేము శ్రీనాథ పద సూచిక సిద్ధము చేయుటకు గ్రహించిన గ్రంథములను వానికి పెట్టబడిన సంకేతములను అనుపూర్విగా ఇచ్చుచున్నాము.

| | | |
|---|---|---|
| 1. | శృంగార నైషధము | శృం. నై. |
| 2. | హరవిలాసము | హర |
| | హరవిలాసము పీఠిక | హర పీ. |
| 3. | భీమఖండము | భీమ. |
| 4. | కాశీఖండము | కాశీ. |

| | | |
|---|---|---|
| 5. | శివరాత్రి మాహాత్మ్యము | శివ. |
| 6. | పల్నాటి వీరచరిత్ర | ప. వీ. |
| 7. | క్రీడాభిరామము | క్రీ. డా. |
| | క్రీడాభిరామము పీఠిక | క్రీ. పీ. |
| 8. | చాటుపద్య మణిమంజరి I భాగము | చా. మం. I |
| 9. | చాటుపద్య మణిమంజరి II భాగము | చా. మం II |
| 10. | చాటుపద్య రత్నాకరము | చా. ర. |
| 11. | శ్రీనాథుని శాసనములు | |
| | ( ఫిరం — ఫిరంగిపుర శాసనము — ఇట్లు ) | శా. |
| 12. | శృంగార శ్రీనాథము | శృం. శ్రీ. |
| 13. | శ్రీనాథుడు శృంగారియా | శ్రీ. శృం. |

ఇందు మొదటి తొమ్మిది గ్రంథములును నిర్వివాదముగా శ్రీనాథ కర్తృకములని విమర్శకులు అంగీకరించినారు. వాని కాలానుపూర్వియు పలువురు అంగీకరించినదియే. హరవిలాస విషయమై కొంత వివాదము మిగిలియే యున్నది. పలనాటి వీరచరిత్ర శ్రీనాథుని రచనయే కాదు. బాలచంద్రుని యుద్ధమును ద్విపద కావ్యముగా రచించిన యా శ్రీనాథుడు మరొక డనువారును కలరు. క్రీడాభిరామ కర్తృత్వము గూడ నేటికిని గాఢముగ వివాదాస్పదముగనే యున్నది. ఇటీవల శ్రీ గుండూరు ఈశ్వరదత్తుగారు తమ "శ్రీనాథ కవిత్వ తత్వము" అను గ్రంథమునందు క్రీడాభిరామము వినుకొండ వల్లభరాయ కృతమను విశ్వాసమును ప్రకటించియున్నారు. మే మీ గ్రంథకాల కర్తృత్వ వివాదములలోనికి ప్రవేశింప దలచలేదు. ప్రసిద్ధమైన వాదములనే యంగీకరించితిమి. చాటుపద్య మణిమంజరి మున్నగు సంకలన గ్రంథములలో శ్రీనాథుని పేర చెల్లు చాటువులుండుటచే వానిని గ్రహించితిమి. వేటూరి ప్రభాకరశాస్త్రులవారి శృంగార శ్రీనాథమునందును, శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి "శ్రీనాథుడు శృంగారియా?" యను గ్రంథమునందును కొన్ని మంచి పద్యములు శ్రీనాథునివి లభించుటచే, వానిని పద సూచికా ప్రమేయమున స్వీకరించితిమి.

కొన్ని గ్రంథములలో ప్రస్తావనా భాగములకు వేరు పద్యక్రమమును, ప్రబంధ భాగమునకు వేరొక సంఖ్యయు ముద్రింపబడి యుండుటచే పీఠికలను వేరుగా పరిగణింపవలసి వచ్చెను. హరవిలాసము దీని కుదాహరణము.

ఇంక మిగిలినవి శ్రీనాథుడు విద్యాధికారిగా నుండిన కాలమున ప్రకటించిన కొన్ని శాసనములు. వీనిని వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు శృంగార శ్రీనాథములో చేర్చిరి. వానిలో ఒకటి రెండు మాత్రము తెలుగు పద్యములు కలవి. మిగిలినవి తెనుగు వచన రూపమునను కొన్ని సంస్కృతమునందును ఉన్నవి. శాసనముల తెనుగు వచనము వ్యావహారికము. శ్రీనాథు డిట్లు వ్రాయునా అని సందేహింప నక్కరలేదు. జనులు వానిని చదివి ఆచరింపవలసిన రాజశాసనము లగుటచే ప్రజలకు సుపరిచితమగు భాషయందు వానిని ప్రకటించి యుండురు. శ్రీనాథుడు ప్రత్యక్షముగ వానిని వ్రాసినను, వ్రాయకున్నను. అతని యనుమతి ముద్రను పొందిన రచనలు కావున అవి మాకు ఉపాదేయము లయినవి. ఆ కాలపు వ్యావహారిక భాషా స్వరూపమును తెలిసికొనుట కివి మిక్కిలి యుపకరించును. మేము పై కొన్న శాసనములు— కల్వపాముల, కొనువుకట్టు, పొన్నుపల్లి, నందమూరు, ఆలపాడు, రుద్రవరం, మూలగూరమ్మకొండ. ఈ విధముగా ఏ యే మూలల శ్రీనాథుని సర్వంకష భాషాప్రతిభ వెలసెనో అయా మారుమూలలు కూడ వెదకి శ్రీనాథ పద సూచికలో వానికి స్థానము కల్పించుటకై యత్నించితిమి. ఆ రచనలన్నియు మహాకవి లేఖినినుండి వెలువడినవి. మరికొన్ని ఆ మహనీయుని ప్రతిభాచ్ఛాయలను అలముకొన్నవి.

ఇంతకుముందు సూచించినట్లు ఆ యా విద్యార్థుల సామర్థ్యమునుబట్టి నాకుగల అభిప్రాయము ప్రకారము క్లిష్టములు, సుగమములు అగు గ్రంథ భాగములను ఏర్పాటుచేసి యిచ్చిన తరువాత వారు శ్రద్ధతో పదముల పట్టికలను సంసిద్ధముచేసి తెచ్చిరి. శ్రీనాథుని భాషా మహారణ్యముయొక్క ప్రకృతి ప్రత్యయ విభాగము చేయించుట నా సంకల్పము. విభాగము చేయుటలో సంధి బంధములను, సమస్త పదములను ఇప్పటికి ప్రామాణిక వ్యాకరణములైన బాల ప్రౌఢ వ్యాకరణ సమ్మతముగ విభజించుటకు సూచించియుంటిని. ఉదాహరణకు—ప్రాతాది సూత్ర లక్ష్యములైన పదములను మూడు ఆరోపములుగా మా విద్యార్థులు కూర్చిరి. ప్రాఁగెంపు.—కెంపు. ప్రాత + కెంపు అను రీతిని విభజించిరి. తరువాత తరువాత సాహిత్య అకాడమీలో పదసూచికలు చేయుచున్న విద్వాంసులతో చర్చించినమీదట ఈ మార్గమును విడిచితిమి. ప్రస్తుత వ్యాకరణము ప్రకారము ప్రాచీనములైన ఈ సమాసములను విడదీసినచో వానిమీద మాతనాలోకమును ప్రసరింపజేయుటకు ప్రతిబంధకమగునని వారు భావించిరి. అది సమీచీనమని నాకును తోచినది. కావున ఇట్టి సమాసములకు రెండే రూపములను మేమును అంగీకరించితిమి. ప్రాఁగెంపు;—కెంపు. పదసూచికా నిర్మాణమునందు మాకన్నముందు బాటలువైచిన వారితో మేము భిన్నించిన పట్టులును లేకపోలేదు. వాని ప్రసక్తి ముందు వచ్చును.

ఇట్లు శ్రీనాథ పదసూచికయొక్క స్థూలమైన దేహయష్టి సంసిద్ధముకాగా ముందేమిటి అను ప్రశ్నము మ్మెద్దుర్కొనెను. "శీఘ్రమంగే సుభాషితమ్" అన్నట్లు ఈ మహాప్రయత్నము సూర్యాలోకభాగ్య మెరుగక తెలుగు శాఖ బీరువాలలోపడి యుండవలసినదేనా యను చింత నన్ను బాధించెను. శ్రీనాథ భారత వ్యాస సంపుటమునందు ఆదరముచూపిన సాహిత్య అకాడమీ అధ్యక్షులు డాక్టరు బి. గోపాలరెడ్డిగారి సేల సమీపింపరాదు. సాహిత్య అకాడమీ కార్యజాతములో దీనిని చేర్చుకొనుడని కోరగనే వారు కార్యదర్శిగారికి నివేదించుటకై యాదేశించిరి. అప్పుడు మా మిత్రులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారును, పదసూచికాతంత్ర ప్రవర్తకులైన శ్రీ అబ్బూరి రామకృష్ణరావు గారును ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు విచ్చేసి, శ్రీనాథ పదసూచికా స్వరూపమునుచూచి, సంతసించి సాహిత్య అకాడమీ కార్యక్రమములో దీనిని చేర్చుకొనుటకు సిఫారసుచేతుమని చెప్పిరి. ఆనాడు శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు కూడ పదసూచికను సందర్శించిన పెద్దలలో ఒక్కరు. త్వరలోనే శ్రీనాథ పదసూచిక సమగ్రరూపమున సాహిత్య అకాడమీ విహారేంద్రము తెక్కలమూటున చేరినది.

పదసూచికల ప్రయోజనములు :— మహాకవుల గ్రంథములకు పదసూచికలు నిర్మించు క్లేశబహుళ కార్యక్రమము ఎంతకాలము సాగవలెను? అసలు వీని ప్రయోజనమేమి? ఇంత బహుళ వ్యయసాధ్యమైన కార్యక్రమమువలన లాభము పొందువారెందరు? ఇత్యాది సందేహములు అప్పుడప్పుడు తల యెత్తుచునే యున్నవి. కావున సంగ్రహముగ సింహావలోకనము చేసికొనవలసి వచ్చుచున్నది. ఆంధ్రభాషకు ప్రామాణికమైన మహా నిఘంటువును నిర్మించుటకై సాహిత్య అకాడమీవారు పూనుకొనిరి. దానికి రెండు ముఖ్యాంగములు సూచితములైనవి. (1) పూర్వమహాకవుల గ్రంథముల పదప్రయోగ సూచికలు నిర్మించుట. దీనివలన కావ్యపదజాలమంతయు ఒక్కచో రాశీభూతమగును. (2) వృత్తి పదకోశములు నిర్మించుట. దీనిచే సువిస్తృతమైన ఆధునిక పదజాలము రుప్పలువడును. ఈయుభయమును సమీకరించుటచే ఉద్దిష్టమైన మహానిఘంటువు అవతరించును. ఇది పరిణతి ప్రయోజనము.

ఇదికాక భాషాతత్త్వము అధ్యయనము చేయదలచినవారికి పదప్రయోగ సూచికలు గొప్ప అలంబనముగా నుండగలవు.

1. అభివృద్ధినందిన గొప్ప భాషలలోనెల్ల పదప్రయోగ సూచికలు గలవు. ఆంగ్లమునందు స్పెన్సరు, షేక్స్పియరు, వర్డ్సువర్తు మొదలగు మహాకవుల రచనల నిట్లు విశ్లేషించి యున్నారు. ఆంగ్లములో వీనిని Concordance అనుచున్నారు. Concord అనగా Agreement between words in case, number, gender,

and person. Concordance అనగా "An alphabetical arrangement of the principal words, contained in a book (originally in the Bible) with citations of the passages in which they occur" అని నిర్వచించినారు.

2. ప్రాచీన భాషలోని పదములన్నియు కూడ మన నిఘంటువులకెక్కలేదు. ఉదాహరణకు శివకవులు వాడిన పదజాతము విస్తారముగా ఇప్పటి నిఘంటువులలో చేరలేదని విజ్ఞులు భావించుచున్నారు. ఇట్లే శాసనములందు ప్రయోగింపబడిన పదజాలమున్ను. వీనికి పదప్రయోగ సూచికలు అనవసరమని యెవ్వరనగలరు!

3. పదసూచికలో పదములకు అర్థములు వ్రాయు నాచారములేదు. కాని ఏ పదము ఏ యే సందర్భములలో, ఎన్నిమారులు వాడబడినదో దీనివలన తెలియును.

4. పదప్రయోగసాంద్రతను (Word Frequency) పదసూచికనుండి తెలిసికొనవచ్చును.

5. ఒక మహాకవియొక్క భాషాప్రయోగ వైచిత్రి దీనివలన బాగుగా అవగతమగును. శబ్దస్వరూపము, విభక్తి ప్రత్యయములు, అన్వయ విధానము కారకవైచిత్రి మున్నగున వన్నియు దీనిలో కనబడును.

6. శబ్దముల చరిత్ర (History of words) వ్రాయుటకు పదసూచికలే ముఖ్యాధారము. ఒకానొక శబ్దము లేక పదబంధము (Phrase) ఎంత ప్రాచీనకాలమునుండి ఉన్నదో తెలిసికొనుట వీనివలననే సాధ్యపడును. అట్లు తెలిసినచో శబ్దముల చరిత్ర వ్రాయగల్గుదుము.

7. శబ్దరూపమునందు ఎటువంటి మార్పులు వచ్చినవో వీనివలన ఎఱుకపడును. నన్నయాదుల కాలమున "నా నేర్చు విధంబున" "నీ చేసిన పని" ఈ విధముగ ప్రయోగించెడివారు. ఇప్పుడు "నేను నేర్చిన విధమున" "నీవు చేసిన పని" ఈ విధముగ వాడుచున్నాము. అవధారణార్థమున "ఏ" వాడెడివారు. "నీవ" అనగా "నీవే" యని యర్థము.

8. క్రొత్త క్రొత్త సమాసములు భాషలో ఎప్పుడేర్పడినవో పదప్రయోగ సూచికలవలననే సులభముగ తెలిసికొందుము. అలరుఁబోఁడి, విరిఁబోఁడి, చిగురుఁబోఁడి వంటి సమాసములు స్త్రీ బోధకములు. చక్కని పద బంధములు. ఇవి నన్నయ భాషయందు కనబడుటలేదు. నన్నెచోడ పదసూచికయందును కానరాలేదు. శ్రీనాథుడు వీనిని విరివిగా వాడినాడు. అందుచేత నివి నన్నయ శ్రీనాథుల నడిమికాలమున ఏర్పడినట్లు సంభావింపవలసి యున్నది.

9. అట్లే శబ్దముల వివిధ రూపములు : ధర్మము—ధర్మువు; చరిత్ర—చరిత్రము; మనము—మనస్సు—మనసు; విశ్వకర్మ—విశ్వకర్ముఁడు — ఈ మొదలైన రూపవైవిధ్య మున్నదని పదసూచికలు నిరూపించును.

10. మన భాషకు నవ్యరీతి వ్యాకరణము వ్రాయవలసి యున్నది. పూర్వులు సాంస్కృతభాషా సహాయముతో వ్యాకరణము వ్రాసియున్నారు. ప్రకృతి ప్రత్యయ విభాగము, సమాసములను విడదీసినప్పుడు వచ్చు శబ్దరూపము— వీని నన్నింటిని వారు చర్చించియే యున్నారు. వారు సాధించిన శబ్ద సిద్ధి అంతయు శాస్త్రీయము కాకపోయినను అది చాలవరకు శాస్త్ర సమ్మతమని యొప్పుకొనవలయును. అయితే, సామ్య భాషా శాస్త్ర పద్ధతులు వారికి పరిచితములై యుండలేదు. ఈనాడు మనము తెలుగుతో సన్నిహిత సంబంధముగల ఇతర ద్రావిడ భాషలనుగూర్చి చదువుచున్నాము. వీని సహాయముతో తెలుగు భాషా వ్యాకరణమును పునర్వీక్షణము చేయవలసియున్నది. నూతన పద్ధతులపై, నూతన భావములతో తెలుగు వ్యాకరణము వ్రాయవలసి యున్నది. దీనికిని పదప్రయోగ సూచికలు మిక్కిలి ఆవశ్యకము.

భారతీయులు శబ్ద బ్రహ్మారాధనమునందు అద్వ్యులు. ఈ వారసత్వము ఆంధ్రులకును కలదు. తమ మాతృభాషా శబ్ద బ్రహ్మమును ఉపాసించుటలో అగు శ్రమయు, వ్యయమును నిరర్థకములని ఆంధ్రులు భావింతురా? ముమ్మాటికిని అనరు. దానిని ప్రత్యక్షము చేసికొని ప్రత్యక్షీకరింపచేయగల విజ్ఞులు కావలెనుగాని.

ఆంధ్రభాషకు రెండు ఉత్తమ పదప్రయోగ సూచికలు ఏర్పడియున్నవి—"నన్నయ పదకోశము, నన్నెచోడ పదప్రయోగ సూచిక" అనునవి. మూడవదిగా అవతరింపబోవుచున్నది "శ్రీనాథ పదప్రయోగ సూచిక" వానికిని దీనికిని లక్ష్యములందును, ప్రస్థానమునందును, ఏదైన భేదముగలదాయని ప్రశ్న జనింపవచ్చును. లక్ష్యభేదము లేదు. నన్నయ, నన్నెచోడుల భాషను విశ్లేషించినట్లే శ్రీనాథుని భాషను విశ్లేషించి దాని లక్షణముల నవగతము చేసికొనుటయే దీనికిని ప్రయోజనము. ఆ విశ్లేషణ విధానమునందు మేమొకింత స్వాతంత్ర్యమును వహించితిమి. అది లాభదాయకమనియే నాకు తోచినది. విజ్ఞులు ప్రమాణము.

ఎట్టి భేదములనగా. నన్నయ పదకోశ నిర్మాతలు తత్సమభాషను దూరదూరముగ నుంచుటకు యత్నించిరి. మన భాషలోని తత్సమ విభాగముయొక్క మహత్వమును వారు గుర్తింపనివా రనుట అనాలోచితమైనమాట. క్రియా సందర్భమున వారును తత్సమధాతువులను సంపూర్ణముగనే తీసికొనిరి.

ఇంక నామ శబ్దముల సందర్భమున వారేలకో సంకోచించిరి. తత్సమ శబ్దప్రయోగము నందు కూడ కొంత వైచిత్రి తెలుగులో లేకపోలేదు. అట్టి వైచిత్రిని ఈ పదప్రయోగ సూచికలలో ప్రదర్శింపక పోయినచో వేరుగా ఎచ్చట చూపింపగలము? నన్నయభట్టు — ధర్మువు, వృద్ధువంటి ప్రయోగములు చేసినాడని నన్నయకోశములో కాకున్న మఱి యెచ్చట ప్రదర్శింపవలెను? అట్టి యవకాశమును పోగొట్టుకొనిరనిమాత్రము మనము కించపడుచున్నాము. అందుచేత మేము శ్రీనాథ పదసూచికలో తత్సమ ధాతువులలోపాటు రూపభేదము కల తత్సమ శబ్దములకు గూడ అవకాశమిచ్చినాము. అవిచేసికొన్న దోషమేమి వెలివేయబడుటకు? చిన్నయసూరిగారిచే గుర్తింపబడుట ఆశబ్దముల నేరముకాదుగదా! విశేషరూపమును పొందదగిన తత్సమ శబ్దములపట్టికను బాలవ్యాకరణము ప్రకారము సిద్ధము చేసికొని, అట్టి విశేషరూపములను శ్రీనాథుడు ప్రయోగించినచో వానిని గ్రంథస్థము చేసితిమి. అట్టివికొన్ని—

1. మిత్రశరణ ప్రధానపాత్రాదులు. బాలవ్యాకరణము. తత్సమ పరిచ్ఛేదము. 18 సూత్రము.
2. తరు, బాహు, ధర్మువు, కర్మువు, అర్ఘువు. వంటివి. బా. వ్యా. తత్స— 48 వివరణ
3. విధాత్రాదులు. ,, 53
4. వృద్ధాదులు. ,, 56
5. చరిత్రాదులు. ,, 55
6. అసురుఁడు—అసుర ,, 60
7. మాతాదులు ,, 61
8. రైగ్లౌశబ్దంబులు. ,, 64
9. కంధరాదులు. ,, 66

మేము ప్రవేశపెట్టిన రెండవ మార్పు. దేశ్యములైన సంజ్ఞానామములను — వ్యక్తులు, నదులు, కొండలు మున్నగువానిని పదసూచికలో చేర్చినాము. సంజ్ఞానామములు తరుచువచ్చుచుండును. కావున గ్రంథ విస్తరము కాకుండుటకై ఒకటి రెండు ఉదాహరణములను మాత్రమే ఇచ్చుటకు నిర్ణయించితిమి. అనపోతు, అహమ్మదుషా, కన్నమనీడు వంటి పేర్లను మరవగలమా. పల్నాటి వీరచరిత్రలో వీరులు తమ ఎద్దులకు కూడ ముద్దినుసుముక్కారు

పేర్లు పెట్టి మురిపెముతో పిలుచుచుండిరి. అరేడు అను గ్రామమును చేర్చితిమి. అరేటి యన్నయ అనుపేరులో నిది వచ్చుచున్నది. ఇట్లే పెక్కు స్థలనామములు వచ్చును. నన్నయ, నన్నెచోడ పదకోశములం దిట్టివానికి స్థానము అత్యల్పము. ఆంధ్రదేశమునకు సంబంధించినంతవరకు నన్నయ పేర్కొన్నవి—వేగిదేశము, రాజమహేంద్రపరము, గోదావరి, భీమేశ్వరము, శ్రీపర్వతము ఇంతియే. నన్నెచోడుడు అంతమాత్రము ప్రసక్తిగూడ కల్పించుకొన్నట్లు కనబడదు. ఇంక శ్రీనాథు డన్నచో అది యంతయు ఆంధ్రప్రపంచమే. ఆంధ్రదేశపు జనులు, కొండలు, నదులు, ఊళ్ళు, పంటపర్యాయములు, కూరగాయలు—ఇవన్నీ శ్రీనాథునకు ప్రాణప్రదము. అతడు వానిని వేయారుమార్లు నోరార కీర్తించుచుండును. ఈ పేర్లను సూచికలో యథాసాధ్యముగా చొప్పించుటకు కృషి చేసితిమి.

తత్సమ శబ్దములకు పదప్రయోగ సూచికలో సముచిత స్థానము కల్పించు నీయత్నము దేశములోకొందరు ఎదురుచూచిన విషయమని తెలిసికొని యానందించినాము. నన్నెచోడ పదప్రయోగ సూచికపై శ్రీ వావిలాల రామమూర్తిగారు ఫిబ్రవరి 10, 1963, ఆంధ్రపత్రిక సారస్వతానుబంధములో విమర్శనము కూర్చుచు ఇట్లు వ్రాసినారు: "తత్సమ శబ్దములు—డు, ము, వు, లు గలవి తీయకున్న నూనె, వింత సమా[illegible] ఈ, వింతప్రయోగములు ఉన్నప్పుడు అవి అట్లే ఆరోపములుగా కూర్చబడియున్న ఎంతబాగుండెడిది. "తొలిపలుకులో" సంపాదకులు తెల్పిన "పుడమీశుఁడు" ఎక్కడనున్నట్లు—పుడమిలో లేడు. ఈశుఁడు డుములులలోఁ జిక్కిపోయెను అమరశేములు—అదృష్టవశమున లేములలో అమరత్వ మొందినది. ఇక సంపాదకులు చూపిన బరిహి, కలుహార, హరుషి, రుషి, బ్రాహ్మడు, తళ్య మున్నగు స్వతంత్రప్రయోగాలు ఎటనున్నవో తెలియుటలేదు." ప్రయోగ వైచిత్రిగల తత్సమ శబ్దములను గూడ స్వతంత్రారోపములుగా గ్రహించుట యుక్తమని శ్రీ వావిలాలవారి భావముగా నున్నది. ఈ యుద్దేశమునే మేము కలిగియుండి కతిపయ తత్సమ శబ్దములను శ్రీనాథ పదప్రయోగ సూచికలో చేర్చితిమి. విజ్ఞులు దీని నామోదింతురను కొందును.

ఈ పద సూచికలో మరికొన్ని చిన్న మార్పులు చేర్పులు జరిగినవి. అగుధాతువు అన్నంతరూపములైన కాన్, కన్ అనువాని విషయమై పదకోశ నిర్మాతలలో నభిప్రాయభేదము గోచరించినది. నన్నయ పదకోశమునందు వీనిని రెండు తెలుగులుగా గ్రహించినారు. "విశేష్య విశేషణముల మీదా అవ్యయాలమీద వచ్చే గాన్ (కాఁ) గఁ (కఁ) ప్రత్యయాలను ప్రత్యేకారోపాలుగా ఇవ్వాలి. తెల్లగా,—గా; ఇట్లుగ,—గ" అని సూచించుచు "గఁ" ప్రత్యయముతో పెక్కు ఆరోపములను ఇచ్చిరి. ధాతువులమీద వచ్చు చేయఁగాఁ, చదువఁగాఁ, చేయఁ గఁ చదువఁ గఁ వంటి వానిని కాన్, కఁ అనునట్లే వీరును అంగీకరింతురు. ఇట్లు నామవిశేషణావ్యయములమీద ఒక ప్రత్యయమును, ధాతువులమీద ఒక ప్రత్యయమును వీరు కల్పించుచున్నారు. దీనికి ఆకరమేమో తెలియదు. ఇవన్నియు అగు ధాతు వికారములనియు మేము భావించుచున్నాము—చదువగా—చదువుట అగునట్లు, చేయగా. చేయుట అగునట్లు అని యర్థము స్ఫురించును. అట్లే చల్లగ అనగా చల్లన అగునట్లు, తెస్సగ—తెస్స యగునట్లు. ఈరీతిని కాఁ, కఁ లు రెండును అగు ధాతుజన్యములని ప్రతీతమగుచుండ కన్, గన్ లు భిన్న ప్రత్యయములని యెట్లు చెప్పవచ్చును. భాషయందు పొదుపు (Economy) అను ప్రవృత్తి కలదని భాషాశాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఒకే ప్రత్యయమును ఒకటికంటె యెక్కువ కార్యములకు వినియోగించుట జరుగునుగాని నిర్హేతుకముగ ఒక క్రొత్త ప్రత్యయమును భాష సృష్టింపదు. కావున మేము కాఁ, కఁ లే మూలరూపములని భావించి యారోపముల నట్లే కూర్చితిమి. నన్నెచోడ పదసూచిక యందును కాఁ, కఁ లే ప్రత్యయములుగా అంగీకరింప బడినవి.

అట్లే ద్రుత విషయమునను కొంత భిన్నాభిప్రాయత కలదు. చేయును, చదువును వంటివి మూల రూపములు కావనియు, చేయున్, చదువున్ వంటి హలంతరూపములు ప్రాచీనములని కొందఱు ఆధునిక భాషాశాస్త్రప్రవర్తకుల మతము. చదువునతడు అన్నప్పుడు చదువున్ + అతడు అనియే పదచ్ఛేదముగాని చదువును + అతడు కాదందురు.

చదువు—తద్ధర్మార్థక్రియా విశేషణమైనప్పుడు చదువున్—అతడు—చదువునతడు అని మేమును అంగీకరించుచున్నాము. పూర్వ వైయాకరణులందరును ద్రుతాంతక్రియా రూపములను అజంతములుగానే భావించినట్లు కనబడును. పలుకును, పలుకుదురనఁగాఁ బలుకుదువు పలుకుదురనగా—ఆంధ్రభాషా భూషణము. క్రియాంతములందు పూర్వులు ద్రుతము స్వత్వ రూపమునే యంగీకరించిరి. ఎను, ను ప్రత్యయములు భూతతద్ధర్మార్థక ప్రథమపురుషైకవచన ప్రత్యయములని బాల వ్యాకరణమతము. ప్రయోగములను పరిశీలింపగా ఎ, ఇ అనునవి భూతార్థ సమాపకాసమాపక క్రియా ప్రత్యయములుగా తోచును. చేసె, చేసి. సంధియందు అజంత శబ్దము పరమైనప్పుడు "ఎ" ప్రత్యయమునకు విసంధి నాపుటకై "న" వచ్చుచున్నది చేసె + అతడు = చేసెనతడు. ఇట్లు ప్రకృతి భావనివారణమునకై "న" వర్ణము రాని రూపమును గలదు. చేశాడు. ఇదియే మనకు వ్యవహారమునందున్న రూపము. ఇట్టి వన్నియు పునః పరిశీలనమునకు విషయములగు చున్నవి. అంతవరకును పూర్వవ్యాకరణ మతమును అంగీకరించుటలో విప్రతిపత్తి యుండకూడదు.

సమాసములను ఆరోపములుగ గ్రహించు పద్ధతియందు కొంతచర్చ యున్నది. సమాసము అనేక పదముల సముదాయమైన ఏకపదము. కావున దీని నంతను ఒక ఆరోపముగా నిచ్చుట శాస్త్రీయమైన విధానము అగును. శ్రీనాథుడు అచ్చిక సమాసములను గూడ తత్సమ సమాసములవలె దీర్ఘములుగ మలచెను. "తళతళం బొలయు తొలకరి మెఱుంగు మొలకలంగలకలనగు కలికి తెలికన్నుఁగవయు (2) పగడంపుఁ జిగురుటధరములతుదలనిగుడుచుఁ బెలు నగవులు బిగియనగినం దెగి పడియెడు నను వడువున నడుగడుగునకు నడనడునడంకు చుంబిడికిటనడంగు నడుములబెడంగు నుంగలిగి" ద్రాక్షారామ గంధర్వాప్సరోభామినుల వర్ణన. భీమేశ్వరపురాణము 1-118. ఇట్టివి యాతని రచనలో కోకొల్లలు. ఇందలి సమాసములను సంపూర్ణస్థితిలో ఆరోపములుగా గొనుట అసాధ్యమైనపని. ఇట్టి వానిని అర్థవంతములైన సమాస ఖండములుగా జేసికొని ఆరోపములు కూర్పవలసి వచ్చెను.

శ్రీనాథుని పదప్రయోగరీతులు : ఈ మహాకవి శైలీసంపదను గూర్చి పలువురు పలువిధముల భావించి యున్నారు. దానిని తిరిగి పలుకుట చర్వితచర్వణమగును. శ్రీనాథుడు ప్రౌఢకవియని, చదువబోయిన వెఱపు పుట్టించు వాడని లోకములో అపప్రథ కలదు. అది కొంతవఱకే సత్యమని చెప్పవలెను. తన కవితాలక్షణముల నాతడు పలుమాఱు చెప్పుకొనియే యున్నాడు. అందలి ముఖ్యలక్షణములు వక్రత్వము, గాఢత్వము, సరసత్వము. ఎవరికేదియిష్టమైన వారు దానిని ఆస్వాదించి సంతోషింతురు. శ్రీనాథుడు సంస్కృత జటిలమైన రచన చేయునని లోకము భావించును. అతడు దేశ్యపదప్రయోగము నందును అంతమక్కువ కలవాడే. నన్నయభట్టు భాష మిక్కిలి ప్రసన్నమైనది. వక్రత, గాఢత్వము దానియందు అరుదు. అందుచే నన్నయ భాషా విశ్లేషణము సుఖముగ నుండును. శ్రీనాథుడు దేశ్యపద సంపదనుకూడ కుంభపోతలుగ గుమ్మరించును. ఒక్కొక్కప్పుడవి చిన్నచిన్న పదములు. ఒక్కొక్కప్పుడవి పంటకాలువలంత పొడవుగను ఒయ్యారముగను ప్రసవించును. కాశీఖండము తృతీయాశ్వాసము నందలి శరత్కాల వర్ణన. ప్రకృతి చిత్రణము చూతుడు. "కుముదంబులు ముదంబందె; లాంగలి చెంగలించె; ఱెల్లులసిల్లె; కాసరగాచె; దోసదోరగిలంబాఱె; పయ్యెరవిసరె; వారివండరియె; కరిమదంబుఁ గురిసె; నందిపోతుపోతరించి ఖణిల్లున అంకెవైచె—అసలడుగువడియె" ఈ రీతిని గుక్కతిప్పుకొనకుండ ముచ్చటైన ఒంటరి పదములతో చెరలాడును. మరొక్కచో చేంతాడులంతేసి అచ్చికసమాసములను ఉరులవలె మనపై విసరును. "చెలువక్రొమ్మించుమేఁ జెక్కుటద్దంబు, కోమలినిట్టూర్పు క్రొవ్వేడినెత్తావి; ఏకతమ తిరుగు చదరులుమిసెడికొలవిదయ్యంబు" శ్రీనాథుడు ఆంధ్రమహాభారతభాషకు చాల సన్నిహితముగ నడచును. కవిత్రయమువారి మీద ఆతనికి కడుంగడు భక్తి తాత్పర్యములు. అవధారణార్థకము, విభక్తిప్రత్యయముల ప్రయోగము, అన్వయము భారతము నందువలెనే యున్నవి. మహామేధావి యగుటచే అప్రయత్నముగనే శ్రీనాథుడు భాషాతారాపథమున విహరించును. అంతలో నేలకు దిగును.

శ్రీనాథ పదప్రయోగ సూచిక సమగ్రరూపములో ఆంధ్రులముందు నాతిదూర భవిష్యత్తునందే నిలువగలదని విశ్వసించుచున్నాము. ఆరంభముననే చెప్పినట్లు ముద్రణ సౌకర్యముల తాబేటి నడకలే ఆలస్యమునకు కారణమగు చున్నవని మనవి చేయుచున్నాము. శ్రీనాథ పదప్రయోగ సూచికను సాహిత్య అకాడమీ కార్యపరంపరలో చేర్చు కొనుటకు దయతో అంగీకరించిన అధ్యక్షపదస్థులు మాన్యశ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికిని, ఎన్నియో అవాంతరము లేర్పడుచున్నను ఓర్పుతోను నేర్పుతోను ఈ గ్రంథమును సమకూర్పించి లోకము ముందుంచుటకు కృషి చేసిన అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికిని సంపాదకీయవర్గము వారు కృతజ్ఞతాబద్ధులై యున్నారు. శ్రీనాథ పదసూచికను ధైర్యసాహసములతో నిర్మించి, ఇప్పుడు జీవిత సహకార వృక్ష శాఖలందు దోబూచులాడుచున్న మా పూర్వ విద్యార్థులకు వారెక్కడనున్నను ఆశీస్సులందించుచున్నాను. ఈ గురుతర కార్యమునందు సుదూరము నావెంటనుండి తోడ్పడుచు వచ్చినవారు డాక్టరు బి. వి. కుటుంబరావు, శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావు, డాక్టరు యమ్. కులశేఖర రావు, శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి మున్నగువారు. వారందరికిని నా యభినందనములు.

18–12–1966<br>పరాభవ–మార్గశీర్షము

**ఖండవల్లి లక్ష్మీరంజనము.**

# శ్రీనాథ పదప్రయోగ సూచిక

## అ

-అ : అరుణోదయము గాని యటక మున్న కాశీ. 7 132
మీర వరామర్శించి రం దనిన నట్లకాక యని 7 145
అట్లకాక యని గురు వియోగంబునన్ 7 146
శిష్యులుం దాను వేలువేల వేదవ్యాసుండు 7 155
తొలునాఁటియట్ల ముక్కంటి మాయన్ 7 155
చేయఁగలవాఁడ నేను నీ చెప్పినట్ల 7 171
వేలువేల భిక్షవేఁడి తేల 7 176
వరిపాటి వేర్వేల బంతి పాగి 7 179
వారి బంతిన కుడిచె నా కానత్ర్త 7 189
మీ ప్రభావంబు మీర యెఱుంగుదురు 7 192
కలవు పెక్కొక పేరిన కలువ కొలఁకులు 7 206
ఒక్క పేరిన కలవు పెక్కు వవనములు 7 206
బ్రహ్మాదులకుఁ గాకఁ కాదదారమ కాని 7 217
అడియ వరంబుగా నిత్తు ననినన్ 7 226
ప్రియ మొక్కటియ చూడఁ గాలకంఠ ! 7 227
అట్లు యగుంగాక యో విశ్వంభర ! 7 228
అర్థ కాంతఁ జేకొముద పాకునట్ల 7 236
తన హస్తము విచ్చియయుండు వానికిన్ 7 236
అనంతరంబ వరద్రవ్య జిహ్వాలోక 7 243
నేన యీ యర్థము పరిగ్రహించువాఁడన్ 7 247
తన దేశంబునకుం బోవుఁ దదనంతరంబ 7 248
అనంతరంబ ఓంకారలింగంబు 7 268
కలుకులు పలుకుటయ నేర్పు గర్వప్రౌఢిన్ శివ. 1 10
ఏగు దెంచిత ప్రార్థనంబ 1 45
ఆవరణంబు లందంద చించి 1 97
అతనంబ లింగమధ్యంబున వెడలి 1 107
పాయక యయుండు నవ్వీటి పరిసరమున 2 6
తరలతా గతియ యుత్సాహమయ్యె 2 95
ద్యూతకేలియ వినోదాపాయ మయ్యెను 2 95
నీ వొక్కండవ సంతాన భిలంబవు 2 106
జంతువులకెల్ల నరియ సంసార యాత్ర 3 6
బ్రహ్మాముఖార యే మలకలయ్యంద్రెల్ల నిద్రింతురో 3 9
సిద్ధమ యతనిన్ భావింతుము 3 17
అంత్యజాతి ముట్టుటయ కర్గెనేని 3 35
కాంత్రౌఢయు వోలెఁ దప్పకయ చూచి 3 41
అప్పు దప్పుడ కలశాబ్ధి మధ్యమునఁ బుట్టిన 3 43
ప్రథమ మదియ నమస్కార కారణమయ్యె 3 46
మాంసంబు భక్షింప మనసు పెట్టినవాఁడ 3 62
గంజాయిఁ దినఁగ మత్కంఠఁ జేసినవాఁడ 3 62
హాలారవము గ్రోల నభిలషించినవాఁడ 3 62
పరకళత్రముల నెంబడఁ దలంచినవాఁడ 3 62
నమ్మతించియ యుండె నాచంద్రవదన 3 69
చంచరీకంబు మగవాఁడు నరియ నువ్వె 3 72
పురుషుండును నట్లయ కాఁ దలంపుమీ 3 73
మగవారి మంచితనము నరియ 3 77
తోన యేతెంచె భ్రమరవందోహ మవుడు 3 95
కార కల్పించిన సంకేత స్థలంబునన్ 3 121
అనంతరంబ యా చాండాలి యతని కిట్లనియె 3 124

-అ : మేము దెంపుమై యుద్ధముసేయఁ జాలకయ శివ. 4 62
హరుని యాజ్ఞయ బలవంత మల్పమెట్టు 4 63
ఒక్కఁ డొకఁడ యాయుధంబులు ధరియించి 4 72
సేనతంబుల నెల్ల వేగంబ పూన్చి వ. పీ. 29
నిలుచుచే శకునంబు నిశ్చయం బిదియ 43
కృష్ణకు సమమిది కీర్తనీయంబ 54
వేగంబ పోయిన ప్రియురాలు గినిసి 62
ఎనమంత్ర కవ్వడ యిచ్చి విద్యములు 65
కాలుండు ముందరిపా కెఱుంగకయ 66
వెలమల దొర్నెని వేగంబ పిలిచి 69
భయమున ననపోకు పలికె వేగంబ 73
అరయ నింతయ కార్యంబు 85
పదరిన మాత్రన ఫలమేమి చెపుమ 91
విషయంబు గురుతెఱుంగకయ 91
కావున నిదియ క్రీడా. 49
ఉత్తరలోన మింట బల ముట్టిన మాత్రన 123
చక్కనివాఁడవ యక్కవాడలోన్ 143
నిర్భాగ్యుఁ డితండ 243
అనంతరంబ భాస్వంతుండు 274
అంకమశక్తియ యన్నపూర్ణయున్ చా. ము. 1 125

కావలిన భావనసేయుమ యొవ్విపేదముల్ శృం. నై. 2 73
దానవుఁడుగాక వాఁడేటి తండ్రి చెపుమ హర. 3 76
యూవనశ్రీయ కర్షమై యున్నె చెపుమ 4 81
అవనిపౌటకు నేమి సంశయము చెపుమ భీమ. 4 167
ఈ గర్భమెవ్వరికై తి చెపుమ కాశీ. 4 226
కాశికానగర మార్గముఁ జూడుమ యొద్దియొక్కఁడో 7 211
కర్తవని పల్కెదవు సిగ్గుగాదె చెపుమ శివ 1 78
ఏమేలు వడసెదె చెపుమ వ పీ 85
ఏరీతి చెపుమ 91
ఫలమేమి చెపుము 91
అంతమ.. అంకమశక్తియ యన్నపూర్ణయున్ చా. మ. 1 126
అంకిలి : ఒక్కింత యంకిలి దెలిసి భీమ. 2 157
మహాధరముసేయు నంకిలి మానుటయును కాశీ. 3 11
అంకిలిఁ : పామేని యంకిలిఁ జాఁగకుండెఁ శృం. నై. 4 139
అంకిలిక్ . తల్పయంత్రణ నిరోధంబు నంకిలికోర్చి 7 172
అంకిలిలేక . అంకిలిలేక యవ్వ దరుణాధరపల్లవ 4 13
అంకిలులు . ఈ తెరువున మీకు నంకిలులు దీర్పఁగఁ భీమ. 4 200
అంకురించినవియును . ...సంకోచంకరణంబులై యంకురించినవియును 2 55
అంకురింప . పులకంబు లంకురింప ప్రాల్చె హర. 3 81
అంగకంబులఁ బులకంబు లంకురింప భీమ. 5 43
అంకురింపం : కంక నంకురింపం జేయంజాలు 4 128
అంకురింపఁ : కంక నంకురింపఁ జేయంజాలు శృం. నై. 1 59
అమృతఁ గ్రేగంట నీరసం బంకురింపఁ కాశీ. 4 143
కంక నంకురింపఁ జేయఁజాలు క్రొత్తమొలకలు 7 26
అంకురింపదు . మందహాస రేఖాలవమంకురింపదు శృం. నై. 3 112
అంకురింపన్ : ...ఘుణాక్కారం బంకురింప నాకశాంకవదన 5 191

అంకురింపన్ : పులకంబు లంకురింప
నంబురుహాక్షికైన శృం.నై. 8 88
శిలావిటంకంబులం గ్రేంకారంబు లంకురింపన్ హర. 2 21
అంగణాలను : తెండువడి యంగణాలను గాలు గాలం కాశీ. 6 287
అంగడి : అంగడి వేల్పుటిండుల సురావవథంబుల హర. 2 44
అంగడిమండి బియ్యము పదార్థములుం గొనివచ్చి కాశీ. 5 65
అంగడి యూరక లేదు 1 125
అంగడి- : దశాలంబనమునఁ జరించు నంగడివీథిన్ భీమ 8 198
అంగడివీథిఁ బల్లవుల కాసగ చా. మ. I 128
అంగద . అంగదఁ దక్స్వయంవర మహామహ శృం.నై. 8 25
అంగదన్ : అంగద నంకవర్తి హరిణాక్ష్యవహార విలోల 8 178
అంగరపాలియలు : సేవియలు నంగరపాలియలు కాశీ. 7 196
అంగలార్చిరి : అంగలార్చిరి విచ్చి రాజుడిఁ బొందిరి హర. 8 10
అంగలార్చెదవు : భక్షింపఁగా లేకున్నం గడు
నంగలార్చెదవు కాశీ. 7 168
అంగలించు· వింగి సేలయుఁ దాటింప నంగలించు శృం.నై. 7 46
అంగలించున్ . అంగలించు నఖలాంగకంబులం 6 80
అంగళ్లయందు · మనుజు లంగళ్లయందు కాశీ. 5 267
అంగళ్లవారు అష్ట భాగ్యంబుల అంగళ్లవారు వ.వి. 4
అంగవింపఁజాలు : విమత పద్మము లంగవింపఁజాలు
శృం.నై. 5 145
-అంగి తొడిగిన కోడంగి తుక్కుగ జేసి వ.వి 5 100
గుబ్బ చన్కట్టునఁ దోఁపుటంగి తొడి క్రీడా. 279
-అంగితో : క్రొత్తమడుఁగుం బొన్నపట్టు నీరంగితో 282
అంగిరమందు అప్పు డంగిరసుం డందఱ మునుల హర. 4 61
అంగిరసుమ : శిరంబున నంగిరసుమ దానంబునఁ కాశీ. 4 171
అంగీకరించి కేవలాత్మత్వ మంగీకరించి 8 18
కొండరాచూలి సేయు సత్కారం బంగీకరించి 4 17
కేలిసుఖంబు లంగీకరించి భీమ. 1 98
కాము కోదండంబు భంగి నంగీకరించి కాశీ. 2 42
అట్టులేయనిచెప్పి అంగీకరించి వ. వి. 26
అంగీకరించితిరో : ఎట్లంగి నంగీకరించితిరో శృం.నై. 7 108
అంగీకరించిన : హార్దకం బంగీకరించిన భంగినిండోఁచెఁ 5 187
అట్టుశృంగారం బంగీకరించిన 6 59
అంగీకరించిన యకించన కళాంక
రేఖాలంకారంబును భీమ 4 128
అంగీకరించు · హాటక కలశ భంగి నంగీకరించు కొలఁది 8 57
శారహారవల్లిమతల్లి భంగి నంగీకరించు 8 212
కైవల్యధవలాభం బంగీకరించు కాశీ. 5 26
అంగీకరించు మనుజుఁడు పాంగోపాంగా
ధ్వరక్రియాఫలము 6 42
అంగీకరించుఁ · పతంగుఁ డంగీకరించుఁ
బతంగవృత్తి శృం. నై. 5 140
అంగీకరించుచు . ఛాయాచ్ఛటా పటలంబు భంగి
నంగీకరించుచు హర. 2 21
పంగిత భంగి తరంగంబు లంగీకరించుచు భీమ. 1 118
దివ్యాంగనా రచితోపచారంబు లంగీకరించుచు 5 42
కాశావర్ధు నమస్కారంబు లంగీకరించుచు కాశీ. 8 176
అంగీకరించుచు . ఉత్పాటించు భంగి నంగీకరించుచు కాశీ. 6 175
అంగీకరించుచున్ : ప్రకారంబు నంగీకరించుచు
ననంగునకుం శృం.నై. 1 97
అవిర్భవించిన భంగి నంగీకరించుచు నగ్ర భీమ. 5 9
అంగీరించుటకు మా యంతరంగములయం
దంగీకరించుటకు...నీవ ప్రమాణంబు హర. 4 46
అంగీకరించున్ : ధమర్లతికఁగా నంగీకరించున్
బతే! శృం.నై. 8 96
అంగీకరించెన్ : వివాహోచితంబగు శృంగారం
బంగీకరించె నప్పుడు 6 48
అంగీకరింప . ప్రియము గలిగిన నంగీకరింపవలదు కాశీ. 8 85
అంగీకరింపం వర్తింప నంగీకరింపంగాని వేఱొక్క
కార్యంబునకు శృం.నై. 8 68
అంగీకరింపఁ · పుష్పాంజలి విశేషంబులభంగి
నంగీకరింపఁ కాశీ. 1 169
అంగీకరింపఁజేసి వసిఁడి కామభంగి నంగీకరింపఁజేసి హర. 5 59
అంగీకరింపుము . నా చేయు ప్రయోజనం
బంగీకరింపుము శృం.నై. 8 8
అంగుటంబునం కేలి యంగుటంబునం జవమత్తుర
పుటంబుల మోపి భీమ. 4 128
అంగుటమునన్ పెన్నుని పాదాంబురుహంబున
నంగుటమున నురవిన శృం.నై. 8 115
అంగుటి- · వేల్పు బంగుటి నీ్ఫటంబు లాచరింప కాశీ 8 22
-అంచ · చక్కని రాయంచ యెక్కిరింత శృం నై 1 5
పాణి పద్మద్వయంబునఁ బసిడియంచ 1 102
రాయంచపలుకులు మనంబునం దలపోయు 2 86
రాయంచ యూరకయుంట లెస్స భీమ 1 14
నడుమ రాయంచ శ్రీపువాయకుండు 8 78
-అంచం కాంచనపక్షంబగు రాయంచం
గనుఁగొని శృం.నై. 1 101
అంచకొదమలఁ : అంచకొదమలఁ బూన్చిన యరద మెక్కి 6 22
అంచకొదమలగమి : అంచకొదమలగమి బెదిరించు
పొల్కి చా. మ I 184
అంచన్ : అంచనెక్కి తాఁ జాల జరించు బ్రహ్మ శివ 1 8
-అంచనుం చింతించి రాయంచనుం గాంచనవర్ణ
గరుదంచలంబగు భీమ. 4 108
అంచబాబాను : అంచబాబా పెక్కు నలరుఁబోణి 1 4
-అంచయుఁ · విరించి రాయంచయుఁ గైటభారి
కిటియును పై 8 212
అంచవన్నియతోడన్ అంచవన్నియతోడ నందమైన
మడుంగు కాశీ. 8 218
-అంచు : తేజేయంచు భజింతు...మదింగోరి శృం.నై. 1 4
కలుగ పేల యువియంచు మదిలోన పెపుడు 1 58
తగవా యంచించు కించుక నంకయుంతురు 1 70
కలిగెడునంచు వేకవలు గైకొనిదూతె 1 94
నిన్ను విశ్వజనమాన్యుఁడ వం చెద విశ్వసించి 1 105
దమయంతి యంచు నొడిపె 2 9
కంటిన్ మంటి నం చెంతయున్ 8 80

-అంత : పావకుయాగమునఁ బొట్రువడి రంత మునుల్ 7 91
ప్రతిష్టంత కారణంబై యుండె నంత కాశీ. 7 181
అంత 7 188
ఎంతయుచ్చినఁ జిత్తమిగ్రుచు నంతమేలు 7 246
అంత నమ్మక బ్రాహ్మణుం డర్థపరతన్ 7 247
పరిణయంబయ్యె నంత శివ. 1 17
వర్ణనీయ యగు సాధ్వి వివాహంబయ్యె నంత 1 28
అంత మేల్కని కూర్చుండె నాదిపురుషుఁడు 1 54
అంత యజ్ఞదత్తుం డ మ్మత్తకాశిని 2 28
అంత 2 66
చందురుఁ డంత చూడఁడు విశానటిఁ బున్నమ... 8 78
సురతసౌఖ్యం బనుభవించె నంత 8 90
ప్రకాశంబుగా నాడుచుండె రంత 8 119
అంత 4 17
ముంచె దేవత లంత మూకలై చూడ ప. పీ. 12
అని బుద్ధిగా తెల్ప నట్లుండె రంత 24
అని అంత తెప్పించిపంపె 29
అది యంత తునకలై అవనిపై బడెను 37
నగరంబు కోటల్రన్నన మీర లంత 31
అయిదురోజులదాక నంత మామామ 42
బద్దలవారంత పరుగున వచ్చి 46
వరు పుత్ర మిత్రులు పరిజనం బంత 56
అరితి చేసిన తర్వాత చెలగి మేమంత 68
అంత నవ్వుచు బాలు డవపోతు కనియె 81
బాలచంద్రుం డంత ప్రాభవం బొప్ప 89
విన్నవించితి మంత వీరులకెదుట 101
బాలచంద్రుం డంత భ్రాతలగూడి 112
తప్పించికొని యంత ధరణిక చేసె 115
అంత మధ్యాహ్న సమయమౌను క్రీడా. 114
విప్రుం డంత నానాధ్వర వ్రతుఁడై పోయి చా మం. 1 129
అంత_ : ఒకఁడంత యోగిరమడిగెనో, యంత
లేసి శృం.నై. 6 185
అంతమాత్రంబకాని కాయంగవెఱచున్ హర. 8 6
ఎంతకాలం బనువర్తించు నంతకాలమునకుఁ కాశీ. 2 148
అంతకాలము నరునకు నావహిల్లదు 5 320
శ్రీవారాణసియు నంత ప్రియమైయుండున్ 7 212
అంతమాత్రమె సుమ్ము ప. పీ. 93
-అంతం. అంతంతం జిక్కరి చిక్కకుండుదురె? శృం.నై. 2 47
అంతంతం జేరవచ్చి యయ్యంత్యజాతి శివ 3 38
అంతం : క్రీడ పలిపి యంతం దనివి సనక హర. 5 52
అంతం గొంత కాలంబునకు 6 28
అంతం బంద్రకళాధరుండు 7 89
లక్షణంబులు పరీక్షించి యంతం బోవక కాశీ 4 21
అంతం బెద్దకాలంబున 5 334
అంతం గొన్ని దినంబులకు 6 8
...సహితంబుగా వెలార్చి యంతం గోవక 6 62
అంతం గొంత కాలంబునకు శివ. 4 18
మృగవిలోచన లంతంత మేను దప్పె శృం.నై. 2 118
అంతంత : అంతంత దవ్వుల నుండఁ బంచి హర. 6 48
దూర మంతంత కారుహ దొంతిమన్నె భీమ. 1 38
చిచ్చు విడివిడి యంతంత పెచ్చు పెరుఁగ 4 61
నలుదెసల నంతంత జాతివడి యున్న 5 128
దూర మంతంత కారుహదొంతి మన్నె కా.. 1 85
అంతంతసాగి ప్రజలు చొక్కు మడంగి 4 120
బాల యంతంత వర్ధిల్లెఁ 5 327
డాసి యంతంత సాష్టాంగ దండ 6 144
అంతంత నిలిచి చిత్త మలరంగ నిన్ను శివ 3 64
అని పీడుకొలిపిన నంతంత వారు ప.పీ. 7
అంతంతం : నీ బోటు లంతంతం జిక్కరి
చిక్కకుండుదురె? శృం నై 2 47
అంతంతం జేరవచ్చి యయ్యంత్యజాతి. . శివ. 3 38
అంతంతఁ. అనుహాసితరదీప్తి నంతంతఁ
జిక్కలు శృం నై. 8 5
పగి యంతంతఁ గట్టెదురఁ గవిరి భీమ 4 162
అంతంతకు : చెదరి అంతంతకు చీకాకు నొంది ప పీ 48
అంతంతకున్: దళలంతంతకు నెక్కఁగా
విరహ. . శృం.నై. 2 115
అంతంతన్. కని రంతంత న్నభో మార్గమున 7 38
అంతంత మట్టిపడు సలిల బిందువు లన కాశీ 8 28
తలఁగి యంతంత మున్నవారు 7 191
అంతంత మున్నవారు మాయం దెవ్వరును లేరు 7 192
-అంతఁ : అంతనంతఁ గాంకారత్నంబుఁ గదియ శృం.నై 8 117
అంతనంతఁ బసుదెంచురు 6 81
అనుహాసితరదీప్తి నంతంతఁ జిక్కలు 8 5
పగి యంతంతఁ గట్టెదురఁ గవిరి భీమ. 4 162
అయిదుక్రోసుల పొలములో నంతనంతఁ కాశీ. 2 146
బాలగను భక్తి యావంతఁ గలిగెనేని శివ 4 55
. వహించుచుండ నంతఁ బంద్రుండు క్రీడా 260
అంతఁ : అంతఁ జింతామణికిఁ జింతయాగరింపఁ శృం నై 2 75
అంతఁ బానుపు మీఁద నైచె 3 36
చనుదెంచె నంతఁ దేరు డిగ్గి 3 44
అంతఁ దలకాయ హ(హ)ల మేలోగిరంబు హర. 2 129
హస్తిచేతికి నిచ్చితి నంతఁబోక 6 19
అంతఁ బయోనిధానమున యందు 6 33
పసెనంతఁ బరివర్తన చిత్రవిలాసలీల భీమ. 5 106
అంతఁ గొంతకాలంబునకు 6 68
అంతఁ గొంతకాలంబునకు కాశీ. 4 2
అంతఁ జూడాకర్మ మాచరించిరి 4 18
అంతఁ గొంతకాలంబునం బ్రియా 5 172
యుగంబులంతఁ బాకాళ లోకాంత... 6 246
అంతఁ గొంతకాలంబునకు శివ. 4 45
అంతఁగాని : కాలం బచ్చిన యంతఁగాని
పడయం గాకాని భీమ. 3 53
-అంతకంపెను : ఇచ్చు నంతకంపెను మఱి భాగ్యము హర. 4 65
అంతకంపెను : అంతకంపెను వేగము కాశీ. 8 78
అంతకంపెను గణతీర్థ మత్యధికము 7 14

అంతకంత : చింత తంత్రికి వర్ధిల్లె నంతకంత కాశీ. 5 227
అంతకంతకు : అంతకంత కలరుఁబోఁడికి శృం. నై. 2 110
అంతకంతకు సంతాప మతిశయిల్లె 2 118
అంతకంతకు యుద్ధ మగ్గలంబాయె ప.వీ. 114
అంతకంతకుఁ : అంతకంతకుఁ బేరుఖ్యా
నావహింపఁ క్రీడా. 187
-అంతకు : అంతకంత కలరుఁబోఁడికి సంతాపము శృం.నై. 2 110
అంతకంతకు సంతాప మతిశయిల్లె 2 118
చెదరి అంతకంతకు చీకాకు నొంది ప. వీ. 48
అంతకంతకు యుద్ధ మగ్గలం బాయె 114
అంతకు : వరుఁడంతకు సంసారక్లేశములు కాశీ. 5 47
అంతకు బాగుగ అమరింతు చీర ప. వీ. 77
బసివిరెడ్డి యంతకు మిగులన్ చా. ప. 1 127
-అంతకుఁ : వేగునంతకుఁ జేసె జాగరంబు కాశీ. 4 118
అంతకంతకుఁ బేరుఖ్య నావహింపఁ క్రీడా 187
-అంతకున్ : నీవు వచ్చునంతకు నిచ్చోటన శృం. నై 2 85
దశలంతంతకు శెక్కగా విరహసంతాపా .. 2 115
నీ నిజంబెఱుఁగు నంతకునంతకు నోర్తు .. శృం. శ్రీ 3 69
-అంతకును : వన్నె తెచ్చితివార వంశమంతకును ప. వీ. 102
అంతకునుమున్న : అంతకునుమున్న నలునిగా శృం.నై. 4 97
అంతకుమున్న . అంతకుమున్న గుణనిధి కాశీ. 4 110
అంతకుమున్న యొక్క కాంతారంబునన్ 5 70
అంతకుమున్న మీఁదెఱింగి బ్రహ్మ కాశీ. 7 67
-అంతట : అంతటంతట మార్గమ్ముల్ చూపించె ప. వీ. 82
అని చెప్పినంతట ఆ బాలు దనియె 40
కని మ్రొక్కినంతట 82
అంతట : అంతట విభూతి యలఁదంగ నాన బట్టు భీమ. 5 157
విప్రకులముఖ్యుఁ డంతట వినయపరత కాశీ 3 146
అంతట 7 87
ఆనందమును బొంది రంతటవారు ప. వీ. 8
ఆవేశమంతట అర్పించి పిదప 7
అంతట బ్రహ్మన్న యా నడిరాత్రి 9
అంతట కన్నమ అధికరోషమున 10
సాగించి యంతట సంతోషమునను 14
అంతట కింకరు లతివేగమునను 17
అప్పు డంతట నలగాము దధికమోదమున 28
నలగాము డంతట నాగమతోడ 28
అంతట అనుచరు లతివేగమునను 30
అంతట నాగమ్మ అశ్వంబు నెక్కి 35
అంతట బహువిక్రమాఢ్య మానసులు 35
అంతట మేడపినైన వార్తలను తెలుపుదు 37
బతమ్మ సెలవిచ్చె నంతట వారు 43
అంతట బతమ్మ ఆనందమునను 44
అంతట దిగివచ్చి హర్షముప్పొంగ 65
అంతట మితివచ్చు అరుగంగవలయు 74
అని వీడుకొలిపిన నంతట వారు 88
అంతట అలరాలు దధికశౌర్యమున 89
అంతట మేడపి కనపోతు చేరి 95
అంతట : అంతట మారచి అయ్యత్తవరుడు ప. వీ. 100
మము బంపి రంతట మగిడి వచ్చితిమి 101
అంతట భాష్కరు డస్త్రాద్రి కేగె 118
దిక్కుల నంతట తేజంబు హెచ్చ 120
-అంతటం : ఇంతంతటం గానరాక నిగూఢ శృం.నై. 4 117
అంతటంతట : అంతటంతట మార్గ మ్ముల్ చూపించె ప.వీ. 82
-అంతటఁ : నిర్ఝరము లింతటనంతటఁ జిందెనో భీమ. 1 97
అంతటఁ : అతఁడ యంతటఁబోక బాహాసనంబు శృం.నై. 3 158
ఆవేశం గుసుమ వర్ష మంతటఁ గురిసెన్ హర. 3 21
-అంతటన్ . ఇంతట నంతటనుక్కి యింత శృం.నై. 1 106
తటాలుమనం బ్రణమిల్లి నంతటన్ హర. 2 47
అంతటన్ : అంతట నశ్వాలు దతికోపమునను ప.వీ. 101
అంతటను : చనుదెంచె నంతటను మాయంబు శృం.నై. 3 82
వయనమ్ము రమ్మని పల్కె నంతటను ప.వీ. 28
పైనమ్ము కమ్మని పలికె నంతటను 29
విశదంబుగా పూసి విపరి రంతటను 72
-అంతటి : కొడుకు టారయు నంతటి యుతధూర్తుండు కాశీ. 4 101
గీసమంతటి మాత్రంబు వెలితి బ్రష్ట 6 277
-అంతటివాఁడు : సురేశ్వరుని యంతటి వాఁ
డతఁడా వ్యకోంగనా... శృం.నై. 4 69
శాత్రవుఁ డొకండు దనంతటి వాఁడు కల్గనీ కాశీ. 1 108
ధురంధరుఁడైన యంతటి వాఁడెక్కడఁ గల్గునోయని 5 269
పార్థుడంతటివాడు ప్రధన రంగమున ప.వీ. 106
-అంతటివానిఁ: శిబింద్రు నంతటి వానిఁ గలుగుండు శృం.నై. 7 81
-అంతటివానికైన : అశ్వినీకుమారు నంతటి వానికైన
రక్షాంచిత హర 5 22
-అంతతప్పునసైనం : అపంత తప్పునసైనం
గలి నోచ్చుఁ గాని శృం.నై. 7 118
-అంతదాఁకన్ . వచ్చు నంతదాఁక మండపిలోను కా 2 168
ప్రాప్తమయ్యెడు నంతదాఁక నెవ్వేళ 5 7
అంతదాఁకనె : అంతదాఁకనె యుతర శీఘ్రాదులెల్ల భీమ. 6 44
-అంతన్ : వింతవారలు లేరుగా యింతనంత
నువిద ! శృం.నై. 4 17
కని రంతంత న్నభోమార్గమున 7 88
హరియును నింతనంత నుండు వారము హర. 6 40
అదనుఁ దప్పినఁ దలఁగి యంతంత మన్న వారు కాశీ. 7 131
అంతంత నున్న వారు మాయందెవ్వటుమ లేరు 7 192
అనివంత వతనితో వాలేము పలికె ప.వీ. 74
అంతన్ : కాలంబు గడపుచుండె నంత నక్కడ శృం.నై. 2 108
అంత నానందరస వార్ధియందుఁ దేలె 3 146
అంత నమ్మహీకాంతుం డటమున్న 3 166
వర్తిల్లుచుండె నంత నొక్కనాఁడు హర. 1 14
అంత నక్కడ 2 86
అంత నా చంద్రానన సభముఖంబున 4 8
అంత నంత ర్హితుండయ్యె భీమ. 5 55
అంత నద్వైతభక్తిఁ గృతార్థుఁ డగుచు 5 161
అంత నొకనాఁడు తరుణి ఘోకాంతవేళ కాశీ. 3 215
అంత నొక్కనాఁడు నారదుండు యదృచ్ఛా.. 4 14

అంతన్ : అంత నొక్కనాఁడు కాశీ. 4 41
అంత నొక్కనాఁ డతని నిత్యపుణ్యుండు 4 64
అంత నట బృహస్పతి పత్నీవియోగవేదనా... 4 214
అంత నక్కడ కనైశ్వరుండు 4 276
అంత నవ్విమానంబు ధ్రువలోకంబు గడచి 4 289
అంత నవ్విమానంబు విష్ణులోకంబు 4 800
అంత నక్కాంత నిజాంతర్గతంబున 5 155
అంత నొక్కనాఁడు చిత్రకరుం డొకరుండు 5 175
అంత నటఁ బర మేశ్వరుండు 5 818
అంత నొక్కనాఁ డద్దేవుండు 5 815
వర్తించుచుండె నంత నొక్కనాఁడు 6 62
నిజవాసంబున కరిగె నంతనక్కడ 6 68
అంత నిటఁదాన కానగు నబ్జభవుఁడు శివ. 1 68
అంత నా సుకుమారుండు నత్యంత సంతోష... 2 81
అంత నెంతేనియుఁ బేటకెల్లం బైన 8 119
అంత నొక్కనాఁ డతండును నదియును 8 121
-అంతన : శిఖర మీటించు నంతన చేరువట్టి ముక్తి కాశీ 8 64
నివాసంబు సొచ్చినంతన బహిర్యాగంబునన్ 5 122
అంతనంత : తొలఁగుడు రంతనంత యమదూతకిరాతులు 2 90
అంతనంతఁ : అంతనంతఁ గాంతారత్నంబుఁ శృం.నై. 8 117
అంతనంతఁ బనుదెంతురు 6 81
అయిదుక్రోసుల పొలములో నంతనంతఁ కాశీ. 2 146
-అంతనరానిదవ్వులన్ : ఇంత యంతనరాని దవ్వులనున్న 4 162
-అంతనుండి : అసియు వరణయుఁ గూడిన యంతనుండి 6 154
అంతనుండి : అంతనుండి హిమవంతుండు హర. 8 27
గాంగా నంతనుండి కునిగా ను త్తరవుముఖమై... కల్య నాన
అంతనుండియు. అంతనుండియు మగిడింపుము శృం.నై. 8 21
-అంతనె : చూచిన యంతనె ఛురికాగ్రమునను ప. పీ. 100
-అంతపొడవు. ధరణిధర మంతపొడవు మృద్రాశి కాశీ. 5 199
-అంతప్రొద్దునన్ : ఒరంత ప్రొద్దున నుందు రుద్రుండు 5 10
-అంతమీఁద. వహించిన యంతమీఁద శృం.నై. 6 45
అంతమీఁద. అంతమీఁద సురలున్ గంధర్వులుం భీమ. 4 208
అడు మణికర్ణికాతీర్థ మంతమీఁద కాశీ. 6 288
అంతమీఁదటఁ : అంతమీఁదటఁ గల్గు రుద్రాక్ష భీమ. 5 157
-అంతమేర : ఐదుక్రోసులంత మేర యువద్రవంబు కాశీ. 2 51
-అంతమేరయును : కదిసి కలంత మేరయును శృం.నై. 8 65
-అంతయు : నిఖిల దిక్తటమంతయు నిండియుండె భీమ 1 54
లోకంతయు భిక్ష పెటఁ బట్టకయునికిన్ 3 124
ఆ వృత్తాంతంబంతయు తల్లి తెలిగించి కాశీ. 4 284
తద్వృత్తాంతంబంతయు నారదునివలన విని 7 67
పట్టణంబంతయు పాడుచేసెదము ప. కీ. 24
తన కార్యమంతయు తగ వినిపింప 95
ఆ మీద పౌరుషమంతయు బోవు 106
-అంతయు : ధాత్రీతలమెంత యంతయు ధరించిన భీమ. 2 89
-అంతయుం. వృత్తాంతంబు లంతయుం
తెలియం శృం.నై. 4 19
మూఁడామడ మేర యంతయుం బుక్కిటి బంటి హర. 2 28
అంతయుం : అంతయుం గమంగొని యాతని కిట్లనిరా 7 176
-అంతయుఁ : విట మానసమంతయుఁ జార హ. ర. 10 85
-అంతయున్ : వృత్తాంతం బంతయు
తెలింగించిన .. శృం.నై. 3 101
వృత్తాంతంబంతయు తెలింగి 8 145
అవ్వృత్తాంతం బంతయు తెలింగించి హర. 2 69
తద్ భీమాటన వృత్తాంతంబంతయు తెలింగి కాశీ. 5 118
ఆకాశమంతయు నద రెడునట్లు ప. పీ 15
ఆకాశమంతయు నదరంగ గడగె 29
అరసి యాద్రవ్యంబు నంతయు విచ్చె 70
అంతయున్ : హిమవంతుఁ డంతయు తెలింగి హర. 5 11
తత్ప్రమాణంబున నంతయు వ్యజరి కాశీ. 6 87
-అంతయును : బింబనంతయును జూసి బెండువడిరొ భీమ. 4 101
కారు వచ్చిన కార్యమంతయును తెప్ప కాశీ. 3 67
చెట్టుక్రిందికి లేదు శిబిరమంతయును ప. కీ. 22
మిగిలిన అర్థమంతయును 42
బొంగరా లాడెదు పొంకమంతయును 45
కరములు ముకుళించి కార్యమంతయును 50
ద్రవ్యమంతయును వ్యయము త్యు 70
ఆ మధ్యలో వేసి రన్నమంతయును 101
కనిపింపసాగిరి విషయమంతయును 101
బాలుర పైనుండు భారమంతయును 106
ఈ ప్రపంగమంతయును తెప్ప. క్రీడా. 265
అంతయును : అంతయును విస్తరింపుమా యనిన శి. 1 114
-అంతయై. జలధరమంతయై కరటిచందముగైకొని హర 6 69
-అంతయైన : కరగదు నీమది కాసంతయైన ప పీ 57
ఎక్కడ సందులే దిసుమంతయైన 88
బాలావు నినుమంతయైన కనుగొనవై తివి 98
అంతర్భవించె : జ్యోతిర్లింగంబునం దంతర్భవించె కాశీ. 6 157
అంతర్భవింప : బహుదీప్తి వ్యాప్తి నంతర్భవింప శివ 1 88
అంతలంతలను : తన్నేమంబు కంతలంతలను పేర్కొల్ మీటి 2 80
-అంతలను. తన్నేమంబు కంతలంతలను పేర్కొల్ మీటి 2 80
-అంతలు కసిరిక కాయలంతలు పయోధరముల్ కాశీ 5 167
అంతలేని కొమరు పాలిండ్లపు అంతలేని కొమరు పాలిండ్ల
వడిగెనో! శృం.నై. 6 185
అంతలేని వారిచే : మా యంతలేని వారిచే
నమస్కారములు గొనఁ కా.. 8 144
-అంతలేనివారు ఎందు నుందురు తమ యంతలేనివారు 7 147
-అంతలో . అంతలో నిద్ర మేల్కాంచి యవనిసురుఁడు శివ. 8 29
అంతలో దినకరుఁ డస్తాద్రి కరిగె ప.పీ 6
తెలివొంది యంతలో ధీరత నిల్పి 58
అంతలో- : అని పల్కునంతలో అమూర్ఛ దెలిసి 47
అనిపల్కు నంతలో అధిక వేగమున 58
అంతలోఁ. కన్నులుమోడ్చ నంతలోఁ గైటభ కాశీ 6 50
-అంతలోన : .. స్నానం బవధరించిన యంతలోన
వంటకంబులు హర 2 56
తలంచు నంతలోన శిరస్తోదము కాశీ. 8 121
బ్రహ్మన్నను కని నంతలోన ప పీ. 12
ఉడుటు వంతములాడు చున్నంతలోన 101

అంతలోపం : అంతలోపం గ్రోధకర్కాంత
  లోచనమందును కాశీ. 4 68
-అంతలోపఁ : అని చెప్పమన్నంతలోపఁ బోరెప్ హర. 6 139
  నిబ్బిన గ్రాలిన యంతలోపఁ చా వడిసెం శ్రీ. కృం. 77
-అంతలోపలన్ : అయ్యయో యనుచు
  మన్నంతలోపల నొయ్యన ప. వి. 98
అంతవట్టును : తత్త్వమెయ్యదియొ తెలియ నంత
  వట్టును కాశీ. 5 88
-అంతవట్టువారిని : పశాంతంబునం దమయంత
  వట్టువారిని కృం. నై. 7 187
అంతవాఁడ తిప్పన్నయు నంతవాఁడ తగువా క్రీడా. 88
-అంతవాఁడు , ఇంద్రునంత వాఁ డానపడిన కృం. నై. 8 51
  అడుసె యిట్లు నీ యంతవాఁడు 7 100
  నీ యంతవాఁడు గటకటంబడి కపియింపం కాశీ. 7 166
అంతవాఁడుగా బదు పదిసేసె వలరాజునంతవాఁడు
  నరయ కృం. నై. 7 168
అంతవాని : అదురఁ జేసితి నైషధు నంతవాని 3 93
అంతవానికిన్ · గిప్పతి యంతవానికిన్ 8 100
అంతవానికిని అంభోజానను నంతవానికిని శక్యంబే కాశీ. 6 259
అంతవానితోన్ : మరుద్గురు నంతవానితో నటమట 2 111
-అంతవారలు : మీయంతవార లపేక్షించియుండ కృం.నై. 7 108
-అంతవారికిన్ : మహామునీంద్రులకు నంబుజ సంభవు
  నంతవారికిన్ కాశీ. 1 76
-అంతవారిన్ , నాకు నాయంత వారి నన్పంగఁగలిగె 6 55
-అంతవారు కంతుఁడును నీవిధుండు
  నొక్కంత వారు కృం. నై. 8 179
  అనిన వేనేర్తునయ్య మీయంతవారు హర. 6 115
-అంతవారె , హరిహరబ్రహ్మలైన నాయంతవారె కృం.నై. 7 119
-అంతవెట్టి , వెఱఁది గుమ్మడికాయంత వెట్టిపుట్టుఁ హర. 3 99
-అంతసందడి దిగువఁబడని యంతసందడి
  పెంద్రోవలందుఁ కృం. నై. 4 128
అంతిపురంబునకు , అంతిపురంబున కేగుదెంచె 7 145
అంతె , తొకకర యిత్తురంతె కవి కృం శ్రీ 6 215
  చక్కురంతె పో మెతుకుదారల్ 6 215
-అంద పతపాతము నీకు గతియంద కాదు కృం.నై 2 28
  తెరపి యరత్రోవయంద మర్మరములయ్యె 2 118
  నిమిషమాత్రంబునంద యావిషధవతిని 7 121
  కారణమునంద విలయంబు గార్యమునకున్ 8 127
  భవత్పుంభావనా విశేషంబున యంద మాకు హర. 4 46
  వర్ణసాంకర్యంబు వాపవాదంబునంద భీమ 1 110
  అహితయంబు వల్మీకంబులయంద జీవన 1 110
  జీవన వంశయంబు వారిదంబుల యంద, వృషా 1 110
  వృషాతిక్రమంబు గృహంబుల యంద 1 110
  పరదర్శనంబు యతుల యంద; దోషోల్లాసంబు 1 110
  దోషోల్లాసంబు కువలయంబుల యంద; కౌరవ 1 110
  కౌరవపదానుసరణంబు కిరాతులయంద 1 110
  తరళత్వంబు కరికర సంతానంబుల యంద 1 110
  ధిరకషోభంబు కొలంకుల యంద 1 110

అంద : అత్రగంధత్వంబు చందనంబుల యంద కాని భీమ. 1 110
  కల్పనం బులఁ కాయఁ దక్షిణము నంద 4 27
  కాలుమ నంద కూలుదురు కాశీ. 3 79
  దివంబునంద కమల వికాసంబు 3 148
  రాత్రియంద యుత్పల వికాసంబు 3 148
  శీఘ్రంబునంద సంసిద్ధిఁ గాంచె 8 232
  అచిరకాలంబునంద ప్రసాదించె 8 234
  అచిరకాలమునంద యొనవతరింతు 8 245
  అభేట మార్గంబు నంద బ్రతుకు 4 60
  నీ యంద పర్వతూతము లుద్భవిల్లు 4 75
  అవసరంబు మహిపాలునంద రేఁల 5 322
  దూరమునంద కరారవిందముల్ మోడిచి 6 5

  పవనాద మందంద యతర్కితోపనతమై కృం.నై 2 45
  ప్రేయకు మందంద పయస్తోయధి వంశమునకు 2 180
  ప్రత్యభిజ్ఞకొలకై యందంద వాత్రువ్వ 8 87
  అమృతబిందువులు పై నందంద చిలుకంగఁ హర. 4 99
  అందంద కొంత తడవు వినోదించె 6 16
  అందంద నవనిధానాధిదేవతలును 6 78
  అందంద యుద్భవించెను నందరమున 6 81
  జలధిపై నందంద వర్తింపఁగా 6 91
  అందంద సందడి పవనయించె భీమ. 4 129
  అమరు లందంద పుష్పవర్షములు గురియ 4 198
  కొమ్మయొక్కత యందంద కొమరసామి 5 115
  అందంద దండప్రణామంబు లాచరించి 6 7
  బాహాయుద్ధం బందంద ఘటించిరి 6 94
  ఆకాశవీథి నందంద వడవ కాశీ. 1 182
  అందంద చేసిరి యతవు గేహమునకు 3 88
  దేవత లందంద నమస్కరింతురు 2 158
  అందంద వక్షోరుహంబు లింపులుపోవఁ 4 18
  అందంద కడుపు మండింప 4 118
  అంధకారాతి నందంద తలపకార భాంసోగ్య 4 142
  అగ్గురుజనం బందంద వారింపగాఁ 4 208
  మునీశ్వరుఁడు దన్నందంద వర్ణింపఁ 4 258
  దిగ్గ్రమంతెత్తి యందంద తిరుగుచుండె 5 78
  హాస్తములు వెంట నందంద యదిమిపట్టి 5 81
  విదళించు నందంద కలుష సంహతులను 5 286
  చాటించెన్ విశ్వవాణి నందంద 5 278
  మెఱపు బుట్టించు నందంద విఘ్నరాజు 6 58
  ఘగులుకో నందంద వింధ్యాద్రి ఘంటావీథి 6 240
  అవరణంబు లందంద చించి శివ. 1 97
  కవులును జెట్టిలు కలసి యందంద ప. వి. 8
  విడిపెను వైరులు వెక్కసంబంద 15
  అనుచు జెప్పిన రాజు లరిగి రందంద 28
  ఊడిగ లందంద యొవరి కొల్వంగ 33
  చెలువంద నిల్చిన చిలుకకు నమము 51
  దరిరేయిని జాకని తల్లడంబంద 75
  పురము తల్లడమంద భూధ్రముల్ కదల 77

అందముగ : గుడికి నందముగ నూలువట్టిన యట్టి భీమ. 3 59
అందమునఁ : అందమునఁ గ్రోఁతిపిల్ల చా. మ. 1 190
అందమునొందె : నిద్రలోవున ట్లందము నొందె ధాత్రి హర. 2 118
అందముల్ : -నతంపా! హంస! నీ కందముల్ శృం.నై. 2 103
అందమై : నీ కందమై యుండు నీలాంబరాకలనము 3 186
అందమైన : అందమైన మడుంగు నిద్దంపుఁ బట్టంబు కాశీ. 3 213
అందమొందంగ : నగవు నందమొందంగ వచ్చె క్రీడా. 41
అందమొందన్ : అత్యద్భుతంబుగా యందమొంద
నమరారి హర. 7 184
అందమొందు : అంసకాస్థూత రేఖల నందమొందు
గంధగజ క్రీడా. 184
అందర : తమ్ముల నందర తగనిల్వఁజేసి ప.పి. 111
అందరన్ : అనుజుల నందర నట బుచ్చి వచ్చి 118
అందరాని : వాక్కున కందరాని యధికతరమైన శృం.నై. 2 8
అందరికి : వీరయుద్ధమున బలియిచ్చి అందరి ప.పి. 27
అమ్ముల నంద విడిచి 70
అందరికి : వస్త్రంబు లిప్పించి వార లందరికి 29
వచ్చెనా అపకీర్తివచ్చు నందరికి 75
వలనొప్ప శీలము వారి కందరికి 108
అందరికిన్ : అందరికి నొసంగి హర్షమొందింప 62
అందరికిని : వీరు లందరికిని విడియముల్ గొనుచు 65
వీరి కందరికిని వేఁడిన ధనము కూరిమి నొసఁగుము 70
అందరియాన : అర్వదార్గురు వీరు లందరి యాన 97
అందరు : అన్నలు దమ్ములు అందరు గూడి ప.పి. 4
అందరు గొల్లెన లమరంగ నెత్తి 8
అనిన వారణభట్టు నందరుచూచి 22
నియతిచే నందరు నిలభక్తి మెరయ 28
వీరులందరు తను వేలంబులోన 37
భూసురు లందరు భుజియించు కొరకు 54
ఆవేళమై వల్కె నందరు వినగ 58
కోమలు లందరు కూర్చున్నవేళ 62
అనపోతు నా బిడ్డ రందరు జములు 78
కోరి మీరంద రొక్కటి కమ్మని 88
అని చెప్పి సభలోన నందరు వినగ 93
కూర్చుండి రందరు కూరిమి మెరయ 94
మడుగులో అందరు మీరు స్నానముల్ చేసి 103
అనుచు బాలుడువల్కె నందరు వినగ 106
తమ్ములా రందరు తడు చింతపడిరి 116
పలికెనందరు విన బ్రహ్మన్న తోడ 117
అందరున్ : తమ్ములందరు నష్టు తత్తరపడుచు 77
అందరును : విప్రులందరును అధిపు నాశీర్వాద మమరంగఁజేసి 15
తల్లిని కనుగొని తనయులందరును 38
ఒగి చుట్టు మున్నట్టి ఒజ్జలందరును 43
తల్లికి మ్రొక్కిరి తనయు లందరును 49
ద్వార సమీపాన తమ్ము లందరును 65
తోహారుచేసి రందరును ప.పి. 83
అందల : అని యందల నియోగించి శృం.నై. 7 139
దాని పైవాలి చొక్క నందల మునములు హర. 6 105

అందలు : అందల గృహమేధులును కాశీ. 6 148
అందలం : దొరల కానించి యందలం గలయం 6 233
అందలఁ : పెరభద్రుఁడు పదంపడి యందలఁ గాచె 7 97
అందలకు : అతఁ డందల కా పదార్థ మొకండున హర. 2 5
వారందల కేము మువ్వురము సంతుష్టిం కాశీ. 2 9
అనుచుఁ బ్రార్థించి రందల కతఁడు మ్రొక్కి 7 40
అందలకున్ : మీ యందలకు నొక్క విన్నపంబు శృం.నై. 7 103
చేసి యందలకు సాహిత్య నమస్కారం బొనర్చి కాశీ 1 68
వల్నాటి సీమ ప్రజ లందలకున్ చా. మ. 1 126
అందలకును : మ్రొక్కించె బుధులకు నందలకును
వట్టితపు కోడలికిఁ హర. 4 70
అందలన్ : అందల మటుమాడి కొంతయు హితంబు 7 149
అందల నాదరించి మిహిరాన్వయ ముఖ్యుఁడు కాశీ. 5 310
అందలను : అందలను భ్రమ పెట్టుచు నవ్వధూటి 6 105
మిమ్ముందలను గంటి మీకృపాబలమున భీమ. 4 44
అందలను గాచు నూర్ధ్వలోకాలయములఁ 5 67
అందలవియును : నాతి యందలవియును ప్రాణములు 2 121
అందలి : అప్పు డంగిరసుం డందలి మునుల యనుమతిన్ 4 61
అందలికిన్ : అందలికి నగ్నిశాప తప్తారకూట
పాటలచ్ఛాయ కాశీ. 4 165
కుమారు సమరంజయు నందలికిన్ 6 92
అందలికిని : అవతంస శశిరేఖ లందలికిని 4 165
డమరు ఖట్వాంగ ఖేటకము లందలికిని 4 165
హస్తిచర్మ పటంబు లందలికిని 4 165
అందలికినిన్ : ఫాలభాగముల నంబకము లందలికినిన్ 4 165
శ్యామకంఠ ప్రదేశంబు లందలికినిన్ 4 165
పవమానభుక్కంకణంబు లందలికినిన్ 4 165
ఆపాండుదేహంబు లందలికినిన్ 4 165
అందలిని : అందలిని జూచి యిట్లని యానతిచ్చె 2 7
అందలినిఁ : రుద్రాక్షధారులఁ బుణ్యనిధుల నందలినిఁ
జూచి కాశీ. 6 151
అందలివద్దన్ : అనిన మంచిదియంచు నందలివద్దన్ ప.పి. 70
అందలు : ఈ యున్నయందలు బృందారక
సంకీర్తనీయ...... శృం.నై. 4 187
అందలు దమయంతి నుద్దేశించి 6 18
తక్కిన వారందలు గుంపులుగట్టి హర. 2 28
శైలవతి మాటకందలు సంతసిల్లి 4 71
ధృతరాష్ట్రక స్త్రులై యందలు పాతెముందురుమహో భీమ. 3 86
అనిన విని యందలు వసిష్ఠమహామునిన్ 4 45
వినియందలు భీమనాథు విశ్వేశ్వరునిన్ 4 101
కలవారందలు దక్షవాటి గమనోత్కంఠా... 5 15
అని సంస్తుతించి యందలు మునిగణములు 6 28
ఈ యున్నవారలందలు నా యానతి 6 96
భువనపావనాత్మకు లందలు ప్రభులు మీకు కాశీ. 3 160
ఈ యందలు నాకు నాయురారోగ్యైశ్వర్యంబులు 5 191
అందలు వేల్పు లిరుపక్కియలనుం 5 280
వేల్పు లందలు సేనలై 5 312
అందలు పారిషదులు నీ చందంబున 6 48

